# చదువవలసిన గ్రంథాలు.


1. Indian Economy – Its Nature and Problems
   by ALAK GHOSH,

2. Indian Economics — by K. K. DEWETT.

3. India's Foreign Trade — by R. L. VARSHNEY,

4. Recent Trends in India's Foreign Trade — by Dr. R. N. PODUVAL.

5. Article on "Foreign Trade and The plan"
   by PRADIP SARKAR
   in Monthly New Age of January 1957.

6. Article on "Foreign Trade"
   by ESSEN
   in Weekly New Age dated August 10, 1958.

7. విదేశీ వ్యాపారం – ద్వితీయ పంచవర్ష ప్రణాళిక –
   ఎ. కె. గోపాలన్ - సందేశం - నవంబరు 56 సంచిక,

# అంతర్గతదేశీయవ్యాపారం

## ( INTERNAL TRADE )

మనదొక పెద్ద సువిశాలమైన దేశం. మనదేశంలో విభిన్న శీతోష్ణస్థితులు, నైసర్గిక స్వరూపాలుగల ప్రదేశా లున్నాయి. అనేకరకాలైన వ్యవసాయికపంటలు పండించ బడుతున్నాయి. ప్రపంచంలో చైనాతర్వాత పెద్దజనాభాగల దేశం మనదే. అందువలన మన అంతర్గతమార్కెట్ చాలా పెద్దదనే చెప్పాలి. సహజంగా మన దేశీయవ్యాపారం విదేశీ వ్యాపారంకన్న పదిరెట్లైనా ఉంటుందని అంచనా వేయ బడింది.

కాని మొన్న మొన్నటివరకు మన దేశీయవ్యాపారం పూర్తిగా అశ్రద్ధచేయబడింది. విదేశీవ్యాపారమే ప్రధాన పాత్రను నిర్వహిస్తూ వచ్చింది. పరాయి బ్రిటిష్‌పరిపాలకులు స్వార్థపరత్వంతో మనదేశంనుండి తమ పరిశ్రమల కవసర మైన ముడిపదార్థాలను తీసుకుపోయేందుకు, తమ పారిశ్రా మిక వస్తువులను మనదేశంలో అమ్ముకునేందుకు వీలుగా విదేశీవ్యాపారాన్నిమాత్రమే అభివృద్ధిచేశారు. తదనుగుణ్యం గానే రైలుమార్గాలను నిర్మించారు. లోతట్టు ప్రదేశాలను కోస్తారేవులతో కలిపారేగాని దేశంలోపలి ఉత్పత్తికేంద్రా లనూ, వ్యాపారకేంద్రాలనూ ఒకదానితో ఒకటి కలుపుతూ రైలుమార్గాలను నిర్మించలేదు. రైలు రవాణారేట్లనుగూడ తమ వ్యాపారాని కనుకూలంగానే నిర్ణయించారు. పైగా

మనదేశంపైన అనేక ప్రత్యక్ష, పరోక్ష అప్పులను అంటగట్టి మన యెగుమతి, దిగుమతుల వ్యాపారంలోని మిగులుద్వారా సగటున సంవత్సరానికి 30 కోట్లరూపాయలచొప్పున జమ కట్టుకుంటూవచ్చారు. ఈవిధంగా దేశీయ వ్యాపారాన్ని కుంటుపరచి విదేశీవ్యాపారాన్ని కొనసాగిస్తూవచ్చారు.

రెండవ ప్రపంచయుద్ధకాలంనుండి ఈ పరిస్థితిలో కొంత మార్పువచ్చింది. భారతదేశం ఋణగ్రస్థదేశంనుండి ఋణదాతగా పరిణమించింది. మన దేశానికి ఇంగ్లండు 1800 కోట్ల రూపాయల స్టెర్లింగు బాకీపడింది. దేశంలో రవాణా సౌకర్యాలు మరికొంత అభివృద్ధి అయ్యాయి. దాదాపు 600 ఫ్యూడల్ సంస్థానాలు రద్దై ఇండియన్ యూనియన్‌లో సంలీనంకావడం వలన కస్టమ్సు అడ్డంకులు తొలగిపోయి అంతర్గత వ్యాపారం బాగా అభివృద్ధిచెందింది. మనఅంతర్గతవ్యాపారం యొక్క స్వభావపరిమాణాలనుగూర్చి తెలిపే విశ్వసనీయ లెక్కలు లేవు. కాని 1940లో జాతీయప్రణాళిక కమిటీయొక్క వ్యాపారశాఖ ప్రకారం 7000 కోట్లరూపాయలకు తగ్గదని అంచనా. దరిమిలా యిది 4 రెట్లు పెరిగియుంటవచ్చునని మరొక అంచనా వేయబడింది.

మనది ప్రధానంగా వ్యవసాయకదేశం గనుక సహజంగాన వ్యవసాయక పంటలు మనదేశీయ వ్యాపారంలో ప్రధాన వస్తువు లనడం నిస్సందేహం. ఐతే ఆహారపదార్థాలు అధిక భాగం స్థానికంగానే వినియోగించబడుతున్నాయి. వాణిజ్య పంటలైన ప్రత్తి, జనపనార, నూనెగింజలు, చెఱకు, పొగాకు

ముఖ్యమైనవి మాత్రమే ప్రధాన వ్యాపారసరుకులుగా ఉంటున్నాయి. కుటీర పరిశ్రమలలో తయారైన వస్తువులు, పారిశ్రామిక సరుకులు తత్స్థానాన్ని ఆక్రమిస్తాయి.

మన అంతర్గత వ్యాపారంలో మూడింట రెండువంతులు యిదివరకే అభివృద్ధియైన రైలు, రోడ్డు సౌకర్యాల ననుసరించి లోతట్టు ప్రాంతాలనుండి బొంబాయి, కలకత్తా, మద్రాసు మొ॥ రేవుప్రాంతాలకు, వాటినుండి తిరిగి లోపలి భాగాలకు మధ్య జరుగుతూఉంటుంది. మిగిలినఒకవంతు లోపలి భాగాలమధ్య పరస్పరం జరుగుతూఉంటుంది.

మనదేశ విస్తీర్ణాన్ని, జనాభాను దృష్టిలోపెట్టుకున్నప్పుడు ఈవ్యాపారం చాలాతక్కువనే చెప్పాలి. ప్రజల కొనుగోలుశక్తి పెరుగుట, రవాణా సౌకర్యాలు విస్తృతంగా అభివృద్ధియగుట, బ్యాంకింగు, బుణసౌకర్యాలు,మార్కెటింగ్, గ్రేడింగ్, స్టోరేజి వగైరా సౌకర్యాలు తగినంతగా అభివృద్ధియగుట జరిగిననాడే అంతర్గత వ్యాపారంయొక్క సర్వతోముఖాభివృద్ధి సాధ్యమౌతుంది.

## కోస్తావ్యాపారం (Coastal Trade)

భారతదేశపు భౌగోళిక పరిస్థితిదృష్ట్యాను, 2000మైళ్ల పొడవునగల కోస్తా దృష్ట్యాను మనదేశములో కోస్తావ్యాపారానికి చాలా ప్రాముఖ్యతఉన్నది. న్యాయతహా మనకు చాలా ఎక్కువగా వ్యాపారనౌకలు ఉండవలసింది. కాని బ్రిటీష్వలసరాజ్యం కావడంవలన మన నౌకావ్యాపారం అభి

వృద్ధికాలేదు. బ్రిటిష్ఓడలే మనకోస్తా వ్యాపారాన్ని సాగిస్తుండేవి. 1939 నాటికి భారతదేశానికి 1½ లక్షలు టన్నేజిగల ఓడలుమాత్రమే ఉండేవి. ఇది ప్రపంచఓడల టన్నేజిలో 2% మాత్రమే. మనఓడలద్వారా మన కోస్తావ్యాపారంలో 25% మాత్రమే సాగుతుండేది. కోస్తావ్యాపారాన్ని పూర్తిగా మనదేశీయ ఓడలకు కేటాయించాలని భారతఓడల యజమానులు చేసిన ప్రయత్నాలు విఫలమౌతూ వచ్చాయి. దీనికి తోడు విదేశీఓడల రవాణా రేట్ల పోటీవలన మనఓడలు సక్రమంగా వ్యాపారాన్ని సాగించలేకపోయ్యాయి.

స్వాతంత్ర్యానంతరం మనకోస్తా వ్యాపారాన్ని అభివృద్ధి పరచేందుకూ, జాతీయ నౌకానిర్మాణాన్ని పెంపొందించేందుకూ కొంతకృషి జరిగింది. పశ్చిమ కోస్తాలో కొచ్చిన్, బొంబాయిరేవులు, తూర్పుకోస్తాలో మద్రాసు, విశాఖపట్నం, కలకత్తాలే గతంలో మనకున్న ఓడరేవులు. ప్రస్తుతం ప్రభుత్వం పశ్చిమకోస్తాలో కచ్చి సింధుశాఖలోని కాండ్లా రేవునూ, కథియవాడ్‌లోని ఓకా రేవును అభివృద్ధిచేయుటకూ, తూర్పుకోస్తాలో విశాఖరేవును విస్తృతపరచుటకూ పూనుకున్నది రేవుల అభివృద్ధినిమిత్తం మొదటిప్రణాళికలో 37 కోట్లరూపాయలు ఖర్చుచేయబడ్డాయి.

అదేవిధంగా నౌకా నిర్మాణాభివృద్ధికికూడా కొన్ని చర్యలు తీసుకున్నది. 1939 నాటికి దాదాపు 1 లక్షా,50వేల టన్నేజిగల 30 ఓడలు మాత్రమే భారతదేశానికుండేవి. 1956 నాటికి 6 లక్షల టన్నేజిగల ఓడలు కల్గిఉండాలనే లక్ష్యంతో ప్రభుత్వం విశాఖపట్టణంలో హిందూస్థాన్ నౌకా

నిర్మాణ కేంద్రాన్ని నెలకొల్పి, 8 వేల టన్నేజిగల ఓడలు నిర్మిస్తూ ఉన్నది. అదేవిధంగా విదేశాలతో నౌకావ్యాపారం నిమిత్తం ఒక్కొక్కటి కనీసం 10 కోట్ల రూపాయల పెట్టుబడితో 3 నౌకా కార్పొరేషన్లు నెలకొల్ప సంకల్పించింది. ఇప్పటికే యీస్టరన్ షిప్పింగ్ కార్పొరేషన్ అనే సంస్థమాత్రమే 20 కోట్ల రూపాయల పెట్టుబడితో యేర్పడి పనిచేస్తూ ఉన్నది.

వీటన్నింటి ఫలితంగా 1951 నాటికి మనఓడల టన్నేజి 3,90,707 కు, 1956 నాటికి 6 లక్షలకు పెరిగింది. ద్వితీయ ప్రణాళికా కాలంలో మన ఓడల టన్నేజిని 9 లక్షలకు పెంచాలని సంకల్పించబడింది. నౌకానిర్మాణాభివృద్ధికి రెండవప్రణాళికలో ప్రభుత్వం 45 కోట్లు, ప్రైవేట్ కంపెనీలు 10 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టాలని సంకల్పించబడింది.

మనం సాగించే కోస్తావ్యాపారాన్ని, విదేశీ వ్యాపారాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఈ అభివృద్ధి చాలాస్వల్పం. ప్రస్తుతం మన కోస్తావ్యాపారాన్ని దాదాపు పూర్తిగా మన ఓడలే సాగించగలిగేస్థితికి వచ్చాయి. కాని విదేశీ వ్యాపారంలో 3% మాత్రమే మన ఓడలు నిర్వహిస్తున్నాయి. తత్ఫలితంగా మనదేశం సంవత్సరానికి సగటున 80 కోట్ల రూపాయలు విదేశీ నౌకలకు చెల్లించుకోవలసివస్తూంది.

## విదేశీవ్యాపారం (Foreign Trade)

మనదేశం క్రీ॥ శకానికి పూర్వంనుండి విదేశాలతో వ్యాపారంచేస్తూఉండేది. క్రీ.శకానికి పూర్వం హిందూరాజుల

కాలంలో ఈజిప్టు, రోమ్, అరేబియా, పర్షియా, చైనా, పసిఫిక్ దీవులతో భూమార్గాన, సముద్రమార్గాన కూడా వ్యాపారం జరుగుతుండేది. సన్నని నూలుబట్టలు, సువాసన ద్రవ్యాలు, చిన్నచిన్న లోహపువస్తువులు వగైరా ఎగుమతి చేస్తూండేది. ఆ దేశాలనుండి లోహాలు, డమాస్కస్ కత్తులు, అరేబియా గుర్రాలు, పర్షియా తివాసీలు, బంగారం వగైరాలు దిగుమతి చేసుకుంటూండేది.

ముస్లిమ్‌చక్రవర్తుల పరిపాలనాకాలంలో ముఖ్యంగా మొగలులకాలంలో కాబూల్, కంధహార్‌ల ద్వారా మధ్య ప్రాచ్యంతోను, మలబార్ కోస్తానుండి దూరప్రాచ్యం, యూరప్ సముద్ర ప్రాంతాలతోనూ వర్తకం జరుగుతుండేది.

బ్రిటిష్‌వారు ప్రవేశించి మొత్తం ఇండియాలో ఇంగ్లీషు పాలన నెలకొల్పినతర్వాతకూడా కొంతకాలంవరకు భారతదేశం బట్టల నెగుమతిచేస్తూనే ఉండేది. కాని క్రమంగా యింగ్లండులో పారిశ్రామికాభివృద్ధి జరుగుతున్నకొలదీ బ్రిటిష్‌వారు మన దేశీయ పరిశ్రమలను నాశనంగావించి మన దేశాన్ని తమ ముడిపదార్థాల మార్కెట్‌గా తయారు చేయుటవల్ల మన విదేశీ వ్యాపారంయొక్క స్వభావం మారిపోయింది. ఒకప్పుడు మనం ఎగుమతిచేసిన సరుకులనే దిగుమతి చేసుకోవలసివచ్చింది.

విదేశీవ్యాపారాన్నిగురించి పరిశీలించేటప్పుడు (1) మన ఎగుమతి దిగుమతి సరుకుల ప్రమాణస్వభావాల గురించీ, వాటియొక్క విలువలను గురించీ, (2) మనవ్యాపారశేషాన్ని

గురించీ, (3) ఏయే దేశాలతో వ్యాపారం జరుగుతున్నదీ 
అనేదాన్ని గురించీ తెలుసుకోవాలి.

## ప్రస్తుతం మన ఎగుమతి, దిగుమతి సరుకుల వివరాలు

ఎగుమతులు :— భారతదేశం ప్రధానంగా యీ క్రింది సరుకుల నెగుమతి చేస్తున్నది.

1. జనపనార సరుకులు :— మనం ఎగుమతిచేసే సరుకులలో ప్రధానస్థానం ఆక్రమిస్తుంది. ఎక్కువగా డాలర్లు సంపాదించేదీ యీ సరుకే. ప్రధానంగా అమెరికాకు, తర్వాత ఇంగ్లండు, అర్జెంటీనా, ఆస్ట్రేలియా, కెనడా, క్యూబా, బర్మా, మొదలైన దేశాలకు ఎగుమతి చేయబడుతూంది. 1955-56 లో యీ సరుకులయొక్క ఎగుమతి విలువ రూ. 118.25 కోట్లున్నది.

2. తేయాకు:— మన ఎగుమతులలో తేయాకు రెండవస్థానం ఆక్రమిస్తుంది. ప్రపంచంలో తేయాకు ఎగుమతులలో భారతదేశానికే అగ్రస్థానం. 70% వరకు ఇంగ్లండుకు, మిగిలినభాగం అమెరికా, కెనడా, ఐర్లాండు, ఈజిప్టు, ఆస్ట్రేలియా, నెదర్లండ్సుకు ఎగుమతిచేయబడుతుంది. 1955-56 లో తేయాకు ఎగుమతుల విలువ 108.69 కోట్ల రూపాయలున్నవి.

3. బట్టలు:— రెండవ ప్రపంచ యుద్ధకాలంలో బట్టల ఎగుమతులు పెరిగాయి. కాని తర్వాతదశలో జపాన్

వస్త్రా దేశాల పోటీవలన తగ్గిపోయాయి. 1955–56 లో 63.55 కోట్ల రూపాయల విలువగల బట్టలు యెగుమతి అయ్యాయి. మలయా, బర్మా, ఏడెన్, ఇంగ్లండు, ఆస్ట్రేలియా తూర్పు, పశ్చిమ ఆఫ్రికాలు, సూడాన్, సిలన్, ఆఫ్ఘనిస్తాన్ లకు మన బట్టలు ఎగుమతిచేయబడుతున్నాయి.

4. చర్మాలు, తోళ్ళు:— పాకిస్థాన్ విడిపోవటంతో మన దేశం ముడిచర్మాలు, తోళ్లను దిగుమతి చేసుకోవలసి వచ్చింది. అయినా మనదేశం ఊనిన తోళ్ళు, చర్మాలను ఇంగ్లండు, అమెరికా, జర్మనీ, ఫ్రాన్సు మొదలగు దేశాలకు యెగుమతి చేస్తూంది. 1955–56 లో ఏటి ఎగుమతుల విలువ 22.9 కోట్ల రూపాయలున్నది.

5. నూనె, నూనెగింజలు:—కొద్ది సంవత్సరాలక్రితం వఱకు కేవలం నూనెగింజలు మాత్రమే ముఖ్యంగా చేసుకొనగ ఎగుమతి అవుతూండేది. కాని యీ మధ్యకాలంలో విరివిగా నూనెమిల్లులు నెలకొల్పడంతో ఎక్కువగా నూనె యెగుమతి చేయబడుతూంది. 1955–56 లో 4.05 కోట్ల రూపాయల విలువగల నూనెగింజలు, 39.37 కోట్ల రూపాయల విలువ గల నూనె యెగుమతి చేయబడింది. ఈ యెగుమతులు ప్రధానంగా ఇంగ్లండు, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, తదితర యూరప్ దేశాలకు చేయబడుతున్నాయి.

6. ముడిప్రత్తి:— దేశ విభజనకు పూర్వం చాలా ముఖ్యమైన యెగుమతిసరుకుగా ఉండేది. కాని విభజనానంతరం మన దేశం పెద్దయెత్తున ముడిప్రత్తిని దిగుమతి చేసుకో.

వలసివస్తూంది. అయినా పొట్టిపింజప్రత్తి మన దేశంనుండి ముఖ్యంగా డాలరు ప్రాంతాలకు యీనాటికీ ఎగుమతి చేయబడుతూనే ఉన్నది. 1955-56 లో 39.38 కోట్ల రూపాయల విలువగల ముడిప్రత్తి, రద్దుప్రత్తి ఎగుమతి చేయబడ్డాయి.

7. సుగంధద్రవ్యాలు:—అమెరికా, తదితర యూరోపియూ దేశాలకు ఎగుమతి చేయబడుతూన్నవి. వీటి ఎగుమతులు రానురాను తగ్గిపోతున్నాయి. 1955-56 లో 10.68 కోట్ల రూపాయల విలువగల సరుకు ఎగుమతి చేయబడింది. (1952-53 లో 20.3 కోట్ల రూపాయల విలువగల సరుకు ఎగుమతి ఐంది )

8. పొగాకు:—ప్రధానంగా ఇంగ్లాండుకు ఎగుమతి చేయబడుతూంది. 1954-55 లో 10.82 కోట్లరూపాయల విలువగల సరుకు ఎగుమతయింది.

9. ఇనుపరాయి, కాకిబంగారం:—ఇవి ముఖ్యమైన యుద్ధావసర సరుకులు. 1950 లో కొరియాయుద్ధ సమయంలో వీటి ఎగుమతులు బాగా పెరిగాయి. 1952-53, 1953-54 లలో వరుసగా 20.8, 24.23 కోట్ల రూపాయల విలువ గల ఇనుపరాయి ఎగుమతి అయింది. కాని 1954 నుండి వీటి ఎగుమతులు పడిపోయాయి. 1954-55 లో 12.24 కోట్ల రూపాయలు విలువగల సరుకు మాత్రమే ఎగుమతి అయింది.

10. లక్క, పీచువస్తువులు, బొగ్గు, ముడిఉన్ని మొ॥ మన మిగిలిన ఎగుమతులలో ముఖ్యమైనవి.

దిగుమతులు:—స్వాతంత్ర్యానంతరం మన దిగుమతి వ్యాపారంలో ముఖ్యమైన మార్పులు వచ్చాయి. ఆహార ధాన్యాలు దిగుమతి చేసుకోవలసి రావటంవలనను, దేశవిభజన ఫలితంగా ముడిప్రత్తి, జనపనారల దిగుమతి పెద్దయెత్తున అవసరమగుటవలనను, పారిశ్రామికాభివృద్ధికి యంత్రాలు, పరికరాలు అవసరమగుటవలనను యీమార్పులు సంభవించాయి. ప్రస్తుతం మనం దిగుమతి చేసుకుంటున్న ముఖ్యమైన సరుకులు యీ క్రిందివిధంగా ఉన్నాయి.

1. ఆహార ధాన్యాలు:—1948 నుండి మన దిగుమతులలో ఆహారధాన్యాలు ప్రధానస్థాన మాక్రమిస్తున్నాయి. 1948—49 నుండి 1952—53 సంవత్సరాలమధ్య మన 703.3 కోట్లరూపాయల విలువగల ఆహారధాన్యాలు దిగుమతి చేయబడ్డాయి. 1953—54లో 72.48 కోట్లు, 1954—55 లో 68.37 కోట్లు, 1955—56లో 29.00 కోట్లరూపాయల విలువగల ఆహారధాన్యాలు దిగుమతి అయ్యాయి. ఇవి ముఖ్యంగా అమెరికా, ఆస్ట్రేలియా, కెనడా అర్జెంటీనా, బర్మా,సయాము దేశాలనుండి దిగుమతి చేసుకోబడుతున్నాయి.

2. ఇనుము, ఉక్కు—యంత్రాలు, యంత్రపరికరాలు, మోటారు, రవాణాబండ్లు:— పారిశ్రామికాభివృద్ధి ప్రణాళికలదృష్ట్యా వీటి దిగుమతులు బాగా పెరిగాయి. 1955–56 లో 299 కోట్ల రూపాయలు, 1956–57 లో 442 కోట్ల రూపాయల విలువగల సరుకు దిగుమతిచేసుకోబడింది.

ముఖ్యంగా బ్రిటన్, అమెరికా, జర్మనీలనుండి యీ దిగుమతులు జరుగుతున్నాయి.

3. ముడిజనపనార:— దేశవిభజన ఫలితంగా దీనిని పెద్దయెత్తున పాకిస్థాన్‌నుండి దిగుమతి చేసుకోవలసివచ్చింది. పాకిస్థాన్‌తో మన వ్యాపారసంబంధాలపైన దీని దిగుమతులు ఆధారపడి ఉన్నాయి. 1953 మార్చిలో పాకిస్థాన్‌తో జరిగిన మూడు సంవత్సరముల వ్యాపార ఒడంబడిక ఫలితంగా సంవత్సరమునకు 18 లక్షల బేళ్ళ దిగుమతి అవుతూంది. ఈ ఒడంబడిక తిరిగి పొడిగించబడింది. దేశంలో ముడిజనపనార ఉత్పత్తి క్రమంగా పెరుగుతూండడంవలన దిగుమతులు క్రమంగా తగ్గుతున్నాయి.

4. ముడిప్రత్తి:— ముడి జనపనారవలెనే దేశవిభజనానంతరం దీనిని దిగుమతిచేసుకోవలసివస్తూంది. క్రమంగా దేశంలో దీని ఉత్పత్తి పెంచబడుతూంది. అయినా ఆహార పదార్థాలతరువాత దీని దిగుమతులే ప్రముఖస్థాన మాక్రమిస్తున్నాయి. 1955–56 లో 58 కోట్లు, 1956–57 లో 53 కోట్ల రూపాయల విలువగల సరుకు దిగుమతి అయింది. ఈజిప్టు, బ్రిటిష్‌తూర్పు ఆఫ్రికా, సుడాన్, అమెరికాలనుండి దిగుమతి చేయబడుతూంది.

5. పెట్రోలియం వగైరా చమురులు:— దేశంలో చమురు పరిశ్రమ అభివృద్ధికాకపోవుటవలననూ, ఉన్న కొద్ది పరిశ్రమ విదేశీయుల చేతులలో ఉండుటవలననూ ప్రతిసంవ

త్సరమూ చాలా పెద్దమొత్తాలలో చమురులను దిగుమతి చేసుకోవలసివస్తూంది. 1954–55 లో 90 కోట్లు, 1955–56 లో 67 కోట్లు, 1956–57 లో 80 కోట్ల రూపాయల విలువగల చమురు ఇరాన్, బర్మా, అమెరికాలనుంచి దిగుమతి చేసుకోబడింది.

మిగిలిన దిగుమతులలో ముఖ్యమైనవి రసాయనిక పదార్థాలు, మందులు ( 31.87 కోట్ల రూపాయలు ), గంగులు ( 19.69 కోట్ల రూపాయలు ), ఇనుపసామగ్రి (17.72 కోట్ల రూపాయలు), విద్యుత్పరికరాలు (11.32 కోట్ల రూపాయలు), కాగితము, స్టేషనరీలు (13.67 కోట్ల రూపాయలు), సిల్కు, సిల్కునూలు(14.4 కోట్లరూపాయలు) (బ్రాకెట్ల లో 1954–55 సంవత్సరములలో ఆ యా సరుకుల దిగుమతుల విలువలు యివ్వబడ్డాయి.)

విదేశీ వ్యాపారసరళి:— వివిధదశలలో మన విదేశీ వ్యాపారం యెలా సాగుతూవచ్చిందో పరిశీలిద్దాం.

రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వం:— 1869 లో సూయజ్ కాలువను తెరచుటతో భారతదేశ విదేశీ వ్యాపారంలో నూతనదశ ప్రారంభమయిందనవచ్చును. 1869సం॥లో మొత్తంమీాద 90 కోట్లరూపాయల విలువగల విదేశీవ్యాపారం 1913–14 నాటికి 376 కోట్ల రూపాయలకు పెరిగింది.

కాని ప్రథమ ప్రపంచ యుద్ధకాలంనుండీ రెండవ ప్రపంచ యుద్ధారంభంవరకూ మన విదేశీవ్యాపారం అనేక ఒడుదుడుకులకు గురిఅవుతూ వచ్చింది. మొదటి ప్రపంచ

యుద్ధకాలంలో మన వ్యాపారం కొంత తగ్గి, యుద్ధంముగిసిన వెంటనే పెరిగింది. కాని 1920-23 సం॥ ల మధ్య జపాను పోటీవలన మన విదేశీ వ్యాపారం బాగా పడిపోయింది. తిరిగి 1923 అనంతరం అనుకూల పరిస్థితులవలన క్రమంగా పెరుగుతూ 1928-29 నాటికి రు. 604 కోట్లకు చేరుకుంది.

ఇంతలోనే 1929 లో ప్రారంభమైన ప్రపంచవ్యాపిత ఆర్థిక మాంద్యంఫలితంగా మనవ్యాపారం, ప్రధానంగా మన ఎగుమతులు బాగా పడిపోయాయి. మన వ్యవసాయక సరుకుల ధరలు విపరీతంగా తగ్గిపోయాయి. ఫలితంగా ఎగుమతుల విలువకూడా బాగా తగ్గాయి. తిరిగి 1933-34 నాటికి ప్రపంచ పెట్టుబడిదారీవిధానం సంక్షోభంలోనుండి కోలుకొనుటతో వాటి వ్యాపారం పెరుగుటతో మన విదేశీవ్యాపారంకూడా పెరిగింది. మరల 1937-38 నాటికి అమెరికాలో ఏర్పడిన ఆర్థికమాంద్యంఫలితంగా మన విదేశీవ్యాపారం తగ్గిపోక తప్పలేదు.

మొత్తంమీద రెండవ ప్రపంచయుద్ధం ఆరంభమయ్యేనాటికి మన విదేశీవ్యాపారం యీ క్రింది ప్రధాన లక్షణాలను కలిగియుండేది. (1) పారిశ్రామిక వస్తువులకన్న, వ్యావసాయిక సరుకులు, పారిశ్రామిక ముడిపదార్థాలే మన ఎగుమతుల్లో అత్యధిక భాగంగా ఉంటూండేవి. ఉదాహరణకు 1938-39 లో మన ఎగుమతులలో పారిశ్రామిక వస్తువులు 30% మాత్రమేఉన్నాయి. (2) దిగుమతులలో అత్యధికభాగం పారిశ్రామికసరుకులే ఉండేవి. ఉదాహరణకు 1938-39 లో

మన మొత్తం దిగుమతులలో యివి 100 కి 63 వంతు లున్నాయి. (3) 1929 వరకు మన విదేశీవ్యాపారంలో దిగుమతులకన్న ఎగుమతులే ఎక్కువగా ఉంటూ వచ్చాయి. కాని 1929-33 ల మధ్య యేర్పడిన ఆర్థిక మాంద్యంకాలంలో మన ఎగుమతులు తగ్గిపోయాయి. అనుకూల వ్యాపార శేషం బాగా తరిగింది. ఫలితంగా బ్రిటిష్ వారికి మనం చెల్లిస్తున్న అప్పులక్రింద బంగారాన్ని ఎగుమతి చేయవలసివచ్చింది. (4) మన ఎగుమతి-దిగుమతుల వ్యాపారం ప్రధానంగా ఇంగ్లండుతోనే జరుగుతూంటుంది. మొదటి ప్రపంచయుద్ధానికిపూర్వం మన మొత్తం దిగుమతులలో నూటికి 63 వంతులకు పైగా ఇంగ్లండునుంచే జరిగేవి. 1938-39 నాటికికూడా దిగుమతులలో నూటికి 33 వంతులు, ఎగుమతులలో నూటికి 44 వంతులు ఇంగ్లండుతోనే జరిగాయి.

రెండవ ప్రపంచయుద్ధకాలంలో:— యుద్ధపరిస్థితుల మూలంగా మన విదేశవ్యాపారంలో కొన్ని ప్రధానమైన మార్పులు వచ్చాయి. (1) మన ఎగుమతులలో పారిశ్రామిక వస్తువులభాగం ఎక్కువయింది. యుద్ధావసరాల వలన జనపనార వస్తువులకు, బట్టలకు బాగా డిమాండు పెరిగి వాటి ఎగుమతులు ఎక్కువయ్యాయి. ఉ॥ బట్టల ఎగుమతి 1938-39 లో 8 కోట్ల రూపాయలనుండి 1942-43 లో 46 కోట్ల రూపాయలకు పెరిగింది. (2) మనదేశంలోనే కొన్ని పరిశ్రమలు నెలకొల్పబడుట ఫలితంగా పారిశ్రామిక ముడి సరుకుల ఎగుమతులు తగ్గాయి. ఉ॥ యుద్ధానికిముందు మన

దేశంనుండి నూనెగింజలు, ప్రధానంగా వేరుశనగ చాలా ఎక్కువగా ఎగుమతిఅయ్యేది. కాని యుద్ధసమయంలో మన దేశంలోనే నూనెమిల్లులు ఎక్కువగా నెలకొల్పుటవలన వాటిఎగుమతి బాగా తగ్గిపోయింది. (3) అంతకుముందు ఇంగ్లండుతో ఎక్కువగా జరుగుతుండే ఎగుమతి-దిగుమతి వ్యాపారం యుద్ధసమయంలో యితర కామన్‌వెల్తుదేశాలు, అమెరికా, మధ్యప్రాచ్యదేశాలతో కూడా జరుపబడింది.

(4) ఇతర దేశాలు యుద్ధంలో చిక్కుకున్న కారణంగా మన దిగుమతులు తగ్గాయి. కాని ఆ దేశాల యుద్ధావసరాల ఫలితంగా మన ఎగుమతులు హెచ్చాయి. అందువలన అనుకూల వ్యాపార శేషం గతంలోకన్నా ఎక్కువయింది. 1941—42, 42—43, 43—44 సం॥ లలో వరుసగా మన దిగుమతులకన్నా ఎగుమతులు 80, 84, 93, కోట్ల రూపాయలు ఎక్కువగా ఉన్నాయి.

## స్వాతంత్ర్యానంతరం మన విదేశవ్యాపారం

తిరిగి 1946–48 సంవత్సరాలమధ్య; అంతకుముందు యుద్ధకాలంలో లభ్యంకాని ప్రజలవాడకపు సరుకులు, యంత్రాలు, యంత్రపరికరాలను దిగుమతి చేసుకోవలసిరావడం వలన, ప్రభుత్వం దిగుమతుల కంట్రోల్‌విధానాన్ని సడలించింది. దానితో మన దిగుమతులు బాగా పెరిగాయి.

ఈవిధంగా దిగుమతులు పెరుగుటకు మరొక కారణం కూడ వున్నది. 1947 లో భారత, పాకిస్థాన్‌లు విడిపోవుటతో

ఒక ప్రత్యేక పరిస్థితి యేర్పడింది. విభజనకు పూర్వం భారత దేశం ముడిజనపనారను, ముడిప్రత్తిని, తోళ్ళను ఎగుమతి చేస్తూండేది. కాని విభజన అనంతరం యివి విరివిగా లభించే ప్రాంతాలు పాకిస్థాన్‌లో ఉండిపోవుటతో అదివరకు వీటిని ఎగుమతిచేసే భారతదేశం భారీయెత్తున వీటిని దిగుమతిచేసుకోవలసివచ్చింది. అలాగే ఆహారకొరత ఏర్పడి ఆహారపరిస్థితి విషమించుటతో పెద్దయెత్తున ఆహారపదార్థాల దిగుమతి కూడా అవసరమయింది. ఈ అవసరాలదృష్ట్యా దిగుమతులను పెంచవలసివచ్చింది. అందుకుగాను భారతప్రభుత్వం 1948 ఆగస్టులో ఓపెన్ జనరల్ లైసెన్సు (నిర్నిబంధంగా లైసెన్సులుయిచ్చే) విధానాన్ని చేపట్టింది. ఫలితంగా మన ఎగుమతులకన్న దిగుమతులు బాగాపెరిగాయి. ఉదాహరణకు 1948–49 లో మన దిగుమతుల విలువ 642.17 కోట్ల రూపాయలకు పెరిగింది. ఎగుమతుల విలువ రు 458.72 కోట్లు మాత్రమే ఉన్నది. అననుకూలవ్యాపారశేషం 183.45 కోట్లయింది. ఈవిధంగా ఎగుమతులు తగ్గి, దిగుమతులు పెరుగుటతో మరొక నూతన సమస్య తయారయి కూచుంది. మన కసలే తక్కువగానున్న విదేశీమారకపు నిధులు, ముఖ్యంగా డాలర్ నిధులు తరిగిపోనారంభించాయి. ఈ ప్రమాదాన్ని నివారించి విదేశీమారకపు ద్రవ్యాన్ని సంపాదించాలంటే ఎగుమతులను పెంచుకోవలసియున్నది. అందునిమిత్తం ప్రభుత్వం దిగుమతులను తగ్గించాలనే సంకల్పంతో 1949 మేలో ఓపెన్ జనరల్ లైసెన్సువిధానాన్ని రద్దుచేసింది. ఎగుమతులను

ప్రోత్సహించింది. ఇంతలో భారతప్రభుత్వం 1949 సెప్టెంబర్‌లో రూపాయి మారకపు విలువను తగ్గించింది.

**రూపాయి మారకపువిలువను తగ్గించుటకు కారణాలు:**— రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా బాగా బలపడి పెట్టుబడిదారీ ప్రపంచంలో ఆర్థికంగా బలమైన రాజ్యంగా తయారయింది. దానితో అమెరికాతో పెట్టుబడిదారీ దేశాల ఎగుమతి-దిగుమతి వ్యాపారం ఎక్కువయింది. ఈ దేశాలు అమెరికాకు చేసే ఎగుమతులకన్న, అమెరికా నుండి తాము చేసుకునే దిగుమతులు ఎక్కువకావడంవలన తాము చెల్లించవలసిన వ్యాపారశేషాన్ని డాలర్లు లేక బంగారం రూపంలో చెల్లించవలసి రావడంవలనసూ యీ దేశాల డాలర్, బంగారంనిధులు తరిగిపోయి డాలర్‌కొరత యేర్పడింది. ఈ నిధుల తరుగుదల సరికట్టాలంటే అమెరికాకు తాముచేసే ఎగుమతులను పెంచుకోవలసియున్నది. అలా ఎగుమతులు పెరగాలంటే అమెరికన్‌డాలర్‌తో తమ కరెన్సీ యొక్క మారకపురేటు తగ్గించబడినప్పుడే సాధ్యమవుతుంది. అంటే అమెరికన్ డాలరుకు యిదివరకుకన్న ఎక్కువ సరుకులు యీ దేశాలలోవస్తాయి. అమెరికన్ వ్యాపారులకు యీ దేశాలలో సరుకు చౌకగా దొరకుటవలన ఎక్కువసరుకులను దిగుమతి చేసుకొనేందుకు అవకాశముంటుంది.

ఈవిధంగా డాలర్‌కొరత యేర్పడిన యింగ్లండు వగైరా దేశాలు డాలర్‌తో తమ కరెన్సీయొక్క మారకపు రేటును తగ్గించుకున్నారు. పెట్టుబడిదారీ మార్కెట్‌తో

ముడిపడియున్న భారతదేశంకూడా అమెరికన్ డాలరుతో తన రూపాయి మారకపు విలువను 100 కి 30.5 వంతులు తగ్గించింది. లేకపోతే అటు అమెరికాతోటీ, యిటు బ్రిటన్ వగైరా దేశాలతోటీ వ్యాపారం దెబ్బతింటుందని భయం ఏర్పడింది.

ఐతే రూపాయి మారకపు విలువను తగ్గించినంత మాత్రాన మన యెగుమతులు కొంత పెరిగియుండవచ్చును గాని, బాగా పెరిగాయనుకోవడం పొరపాటు. డాలరుతో మాత్రమే మన రూపాయి మారకపువిలువ తగ్గించబడినసేదని గుర్తుంచుకోవాలి. డాలర్ ప్రాంతాలైన అమెరికా, కెనడాలతో మనవ్యాపారం సహజంగా తక్కువ. స్టెర్లింగ్ ప్రాంతాలతోనే యెక్కువ. స్టెర్లింగ్ ప్రాంతాలుగూడా తమ కరెన్సీ యొక్క మారకపు విలువను తగ్గించడంవలన ఆ దేశాలతో మన వ్యాపారం పెరిగే అవకాశాలులేవు. రెండవది పాకిస్థాను తన రూపాయి మారకపు విలువను తగ్గించని పాకిస్థానుతో మన వ్యాపారం 1951 ఫిబ్రవరివరకు స్తంభించిపోయింది.

ఐతే యీదశలో మన యెగుమతులు బాగా పెరుగుటకు కారణమేమిటి? రూపాయి మారకపువిలువను తగ్గించిన కొంతకాలానికే కొరియాయుద్ధం ప్రారంభమైంది. దానితో అమెరికా, కెనడా, ఇంగ్లండు తదితర యూరోపియన్ పెట్టుబడిదారీ దేశాలు, ముఖ్యంగా అమెరికా పెద్దయెత్తున యుద్ధావసర సరుకులను కొని నిల్వచేయ నారంభించాయి. మనదేశంలో యుద్ధావసరాలైన ముడిసరుకులకు యెగబడ్డారు. ఫలితంగా మన యెగుమతులమొత్తం పెరగడమేగాక వాటి ధరలు పెరిగి విలువకూడా హెచ్చింది.

పైన వివరించిన కారణాలవలన ముఖ్యంగా కొరియా యుద్ధంవలన 1949 ఆఖరుభాగంనుండి 1951 ప్రారంభంవరకు మన విదేశీవ్యాపారం విలువ యెన్నడులేనంతగా పెరిగింది. 1949 లో 1060 కోట్ల రూపాయలనుండి 1950 లో రు. 1146 కోట్లకు, 1951 లో రు. 1610 కోట్లకూ పెరిగింది. ముఖ్యంగా బట్టలు, తోళ్ళు, చర్మాలు, నూనె, నూనెగింజలు, పొగాకు, మైకా, లక్క మొదలగు సరుకుల యెగుమతి బాగా పెరిగింది. 1949 సెప్టెంబర్‌నుండి 1950 సెప్టెంబర్ లోపల ఒక్క బట్టల యెగుమతుల విలువ అంతకుక్రితం సంవత్సరం ఉన్న రు. 31 కోట్లనుండి రు. 82 కోట్లకు పెరిగింది. ఇదే సమయంలో ఆశించినట్లుగానే దిగుమతులు తగ్గాయి. ఫలితంగా మన వ్యాపారంలో లోటు 1948-49 లో రు. 183.45 కోట్లనుండి 1949-50లో రు. 118.89 కోట్లకూ, 1950-51లో రు. 22.01కోట్లకూ తగ్గిపోయింది.

కాని త్వరలోనే 1951 ప్రారంభంనుండి యీ అనుకూల పరిస్థితులు అంతరించాయి. దేశావసరాలకుకూడ చాల కుండా కొన్నిసరుకులు యెగుమతి కానారంభించాయి. దానితో భారతప్రభుత్వం తన విదేశీ వ్యాపారవిధానాన్ని సవరించింది. ఎగుమతులను ప్రోత్సహించుటకు మారుగా దేశావసరాలదృష్ట్యా నాన్ ఫెర్రస్ లోహాలు, తోళ్లు మొదలైనవాటి యెగుమతులను చాలావరకు నిషేధించింది. బట్టలు, ప్రత్తి, నూనె, నూనెగింజల యెగుమతులపై నిర్బంధాలు విధించింది. జనపనార సరుకులు, బట్టలపైన యెగుమతిసుం

కాలు హెచ్చించింది. మిరియాలు, ముడి ఉన్నిపైన కొత్తగా యెగుమతిసుంకాలు విధించింది.

1951 ఏప్రిల్‌లో మొదటి పంచవర్షప్రణాళిక ప్రారంభం కావడంతో భారతప్రభుత్వం యీక్రింది ప్రధానసూత్రాల ననుసరించి విదేశీవ్యాపారం జరగాలని నిర్ణయించింది. (1) ఎగుమతులు యెక్కువ చేసేందుకు కృషిచేయాలి. దేశప్రయోజనాలకు, అభివృద్ధి ప్రణాళికలకు, అత్యావసరమైన సరుకులను మాత్రమే దిగుమతి చేసుకోవాలి. (2) మనకు లభ్యమయ్యే విదేశీమారకపు ద్రవ్యవసరులను దృష్టిలో పెట్టుకొని విదేశీ వ్యాపారంలో వస్తున్న కొరతను సాధ్యమైనంతవరకు తగ్గించుకోవాలి.

ఈవిధానాన్ననుసరించి ప్లానింగ్ కమిషన్ మొదటి ప్రణాళికా కాలంలో విదేశీవ్యాపారంలోని లోటును పూడ్చుకునేందుకు రు 290 కోట్లవరకు మనవిదేశీ మారకపు నిధులలో నుండి వాడుకోవలసిరావచ్చునని అంచనావేసింది. కాని వాస్తవానికి కొన్ని అనుకూల పరిస్థితులవలన మన విదేశీ మారకపు రిజర్వులలోనుండి మొదటిప్రణాళికా కాలం మొత్తం మీద రూ 121 కోట్లు మాత్రమే వాడుకోబడింది. ఇంకా రు 759 కోట్ల విదేశీమారకపునిధి మనకు నిల్వవున్నది. ఈ విధంగా అంచనాలకన్న తక్కువ వాడుకోవడానికి ప్రధాన కారణం అనుకూల ప్రకృతివలన వ్యవసాయపంటలు శాస్త్ర బాగాపండి ఆహారపదార్థాలు, ప్రత్తి, జనపనారల దిగుమతులు తగ్గడమే. యంత్రాలు, యంత్ర పరికరాలు పారిశ్రామికవస్తువుల దిగుమతులుకూడ అనుకున్నదానికన్నా తగ్గడం

మరొక కారణం. ఫలితంగా 1952 నుండి మనదేశ వ్యాపారంలో లోటు క్రమంగా తగ్గుతూ వచ్చింది.

(కోట్ల రూపాయలలో)

| | 1951-52 | 1952-53 | 1953-54 | 1954-55 | 1955-56 |
|---|---|---|---|---|---|
| ఎగుమతులు | 730.1 | 601.9 | 539.7 | 596.6 | 642.2 |
| దిగుమతులు | 962.9 | 633.0 | 591.8 | 681.6 | 747.7 |
| వ్యాపారశేషం | —232.8 | —31.1 | —52.1 | —85.0 | —105.5 |

(జూన్ 1956 రిజర్వుబాంక్ ఆఫ్ యిండియా బులెటిన్)

పై అనుకూల పరిస్థితులను ఎక్కువ అంచనావేసి ప్రభుత్వం 1956 నుండీ నిర్లక్ష్యంగా దిగుమతులను పెంచేందుకు అవకాశమిచ్చింది. ఈ అలక్ష్యపు ఖరీవలన రెండవ ప్రణాళిక ప్రారంభించిన రెండు సంవత్సరాలకే ప్రభుత్వ అంచనాలన్నీ తలక్రిందులై తీవ్రసంక్షోభం యేర్పడింది.

రెండవ ప్రణాళికాకాలంలో మన ఎగుమతులు, దిగుమతులు యీ క్రింది మొత్తంలో ఉండవచ్చునని ప్రభుత్వం అంచనా వేసింది. రెండవప్రణాళిక మొదటిసంవత్సరంలో రూ. 700 కోట్లు, రెండవసంవత్సరంలో రూ. 900 కోట్లు, మూడవసంవత్సరంలో రూ. 1,000 కోట్లు, మిగిలిన రెండు సంవత్సరములలోను దాదాపు సం॥నకు రూ. 870 కోట్లు (మొత్తం 5 ఏండ్లలో దాదాపు 4,340 కోట్ల రూపాయలు) విలువగలిగిన దిగుమతులు అవసరమౌతాయని, అలాగే మన ఎగుమతుల విలువ సం॥నకు 600 కోట్ల రూపాయలచొప్పున ఐదేండ్లలో రూ. 3,000 కోట్లుండవచ్చుననీ, యీ విధంగా మొత్తము పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యాపారలోటు

రూ. 1,340 కోట్లు ఉండవచ్చుననీ, దీనిలో రూ. 225 కోట్లు జమ ఇతర ఐటములద్వారా వచ్చుననీ, పోగా దాదాపు రూ. 1,100 కోట్లు విదేశీమారకపు లోటు ఏర్పడవచ్చునని అంచనా వేయబడింది.

కాని ఆచరణలో యీ అంచనా లన్నీ తలక్రిందు లయ్యాయి. దిగుమతులు అనుకున్నదానికన్న బాగా పెరిగాయి. ఎగుమతులు బాగా తగ్గాయి. 1956-57 లో దిగుమతులు రూ. 1077 కోట్లుంటే, ఎగుమతులు రూ. 637 కోట్లు మాత్రమే ఉన్నాయి. 1957-58 లో సంవత్సరం అంటసంగం వరకు దిగుమతులు రూ. 1,175 కోట్లకు పెరిగితే, ఎగుమతులు రూ. 575 కోట్లకు దిగజారాయి. అంటే రెండవ ప్రణాళిక మొదటి రెండు సం॥లకే మన విదేశీవ్యాపారంలో మొత్తం లోటు రూ. 1,040 కోట్లయింది. దీనితో మన విదేశీమారకపు ద్రవ్యనిధులు త్వరితగతిని తరిగిపో నారంభించాయి. విదేశీ మారకపు సంక్షోభం ఏర్పడింది.

ఈ సంక్షోభంలోనుండి బయటపడేందుకు ప్రభుత్వం కొన్నిచర్యలుతీసుకుంది. 1957జూలై నెలలో దిగుమతులపై తీవ్ర నిర్బంధాలను విధిస్తూ ఒక నూతన విధానాన్నవలంబించింది. దీనిప్రకారం (1) రెండవ ప్రణాళికలోని ముఖ్య ప్రాజెక్టులను యీపాటికి దరిదాపు పూర్తిగావచ్చిన ప్రాజెక్టులకుమాత్రమే విదేశీమారకపుద్రవ్యం వాడుకోనివ్వబడుతుంది. (2) ప్రస్తుత ఆర్థికవ్యవస్థలో ఉద్యోగస్థాయిని, ఉత్పత్తిస్థాయిని కాపాడేం దుకు అవసరమైన పారిశ్రామిక ముడిసరుకులు, యంత్ర పరి

కరాలుమాత్రమే దిగుమతి చేసుకోవలసి యుంటుంది. (3) కొన్ని పరిశ్రమలలో ఉత్పత్తియైన సరుకుల ఎగుమతిని ఎక్కువచేసేందుకు కృషిచేయాలి. ఇటువంటి పరిశ్రమలకు ఉత్పత్తిని పెంచేందుకు, విదేశాలలో తమసరుకు నమ్మేందుకు ప్రభుత్వసహాయం యివ్వబడుతుంది. ఈ పరిశ్రమలు ఎగుమతులద్వారా సంపాదించుకున్న విదేశీమారకపు ద్రవ్యంలో నుండి 75% వరకు తమ పరిశ్రమల విస్తరణకు అవసరమైన పారిశ్రామిక ముడిసరుకును దిగుమతిచేసుకొనేందుకు అవకాశ మివ్వబడుతుంది. అలాగే ఎగుమతివ్యాపారస్తులకు చౌకవడ్డీ రేట్లపైన అప్పులిప్పించేందుకు రిజర్వుబ్యాంక్, స్టేట్ బ్యాంకులకు ఆదేశాలిచ్చింది.

ఆచరణలో యీ చర్యలన్ని పెద్దగా తోడ్పడలేదు. ఒకవైపున దిగుమతులలో కోత పెడుతూంటే, రెండవవైపున ఎగుమతులుకూడా తరిగిపోతున్నాయి. 1958 ఏప్రిల్-జూన్ల మధ్య మన ఎగుమతులు గత సం॥లో యిదేకాలంలో జరిగిన ఎగుమతులకన్న రు. 28 కోట్ల మేరకు తగ్గిపోయాయి. మన విదేశీ ద్రవ్యమారకపు నిల్వలు మరింత తరిగిపోతున్నాయి. ప్రభుత్వం ప్రస్తుతం దిగుమతులపైన నిర్బంధాల నెక్కువ చేయ సంకల్పించింది. 1958 అక్టోబర్-డిశెంబరు నెలల మధ్య ముఖ్యావసరాలైతే తప్ప దిగుమతుల నంగీకరించగూడదని నిర్ణయించింది. ఆదేవిధంగా ఎగుమతులను ప్రోత్సహించేందుకుగాను వేరుశనగనూనె, ఆముదాలపై ఎగుమతి సుంకాలను ఈమధ్య రద్దుచేసింది. పంచదార ఎగుమతిని తానే స్వయంగా నిర్వహించ దలచింది. త్వరలోనే నూనెగింజలు,

కొన్నిరకాల నూనెలు, చెప్పులు, చేపలు, మాంసం, కూరగాయలు, పండ్లు, పవర్ ఆల్కాహాల్ వగైరా సరుకుల యొగుమతినిగూడా స్వయంగా నిర్వహించదలచింది. ఎగుమతి సరుకుల నుత్పత్తిచేసే పరిశ్రమలకు పన్నుమినహాయింపు లివ్వాలనే తలంపుతోనుంది.

## వాణిజ్యవిధానము - వ్యాపార ఒడంబడికలు

**( Commercial Policy & Trade Agreements )**

భారతదేశం 1923 వ సం॥ వరకు స్వేచ్ఛావ్యాపార విధానాన్నే అనుసరించింది. భారతదేశంలో మొదటి ప్రపంచ యుద్ధకాలంలోను, అటుపిమ్మట కొన్ని పరిశ్రమలు (తాతా ఉక్కు పరిశ్రమ, బట్టలపరిశ్రమ, పంచదారపరిశ్రమ, కాగితం పరిశ్రమ, అగ్గిపెట్టెలపరిశ్రమ వగైరాలు) అభివృద్ధికావు పారిశ్రామికవస్తువులను దేశంలోనే ఉత్పత్తి చేయుచుండుటతో విదేశీ పోటీనుండి వీటిని సంరక్షించవలసిందని ఆందోళన బయలుదేరుటతో ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం స్వేచ్ఛావ్యాపార విధానానికి స్వస్తిచెప్పి కొన్ని పరిశ్రమలకు, నాటిలో ఉత్పత్తియైన సరుకులకు "విచక్షణతోకూడిన రక్షణ" (*Discriminatory Protection*) అనే విధానాన్ని 1923 వ సం॥ నుండి అవలంబించవలసి వచ్చింది. దీనిప్రకారం తాతా ఉక్కు పరిశ్రమకు, బట్టల పరిశ్రమకు, పంచదార, కాగితం, అగ్గిపెట్టెల పరిశ్రమలకుమాత్రమే కొద్దిగా రక్షణ యివ్వబడింది. కాని రసాయనిక వస్తువులు, నూనె, బొగ్గు, సిమెంటు,

గ్లాసు పరిశ్రమలకుమాత్రం పూర్తిగా రక్షణ నిరాకరించబడింది. రెండవప్రపంచ యుద్ధానంతరం మరికొన్ని పరిశ్రమలకు రక్షణ కల్పించబడింది.

1929–33 సం॥ మధ్య యేర్పడిన ఆర్థికమాంద్యం కాలంలో భారతదేశంయొక్క వ్యాపారం బాగా క్షీణించింది. బ్రిటిషువారి వ్యాపారంకూడా దెబ్బతిన్నది. దానితో తన సామ్రాజ్యదేశాలతో వ్యాపారాన్ని రక్షించుకొనేందుకు బ్రిటిషుప్రభుత్వం 1932 లో కెనడాదేశంలోని అటావా నగరములో తన సామ్రాజ్యదేశాల ఆర్థిక మహాసభను జరిపి ఒక వ్యాపార ఒడంబడికను తయారుచేసింది. దీనినే అటావా ఒడంబడిక అంటారు. ఈ ఒడంబడికపైన భారతదేశంకూడా సంతకం పెట్టింది. దీనిప్రకారం ఇంగ్లండునుండి భారతదేశానికి దిగుమతయ్యే సరుకులలో కొన్నింటిపైన (మోటారుకార్లు వగైరాలపై) సాధారణంగా విధించే సుంకాన్ని 7½% తగ్గించుటకు, మరికొన్నిటిపైన (విద్యుత్పరికరాలు, ఉన్ని వస్తువులు, స్పిరిట్సు వగైరాలపై) 10% తగ్గించుటకు, అంగీకరించింది. అలాగే భారతదేశం ఇంగ్లండుకు ఎగుమతి చేసే సరుకులపైన కొన్నింటికి సుంకం 10% తగ్గించుటకు, కొన్నింటికి సుంకంలేకుండా చేయుటకు అంగీకరించింది. దీని ఫలితంగా ప్రపంచమార్కెటులో దెబ్బతిన్న బ్రిటిషు పారిశ్రామికవస్తువులకు మార్కెటు లభించింది. మనదేశంనుండి బ్రిటనుకు ఎగుమతయ్యే సరుకులలో ప్రధానంగా తేయాకు, జనపనారవస్తువు లుండుటవలన. వీటిపైన పెత్తనంగల బ్రిటి

యజమానులే లాభాలు పొందారు. కావున రెండువిధాల యీ అటావా ఒడంబడికద్వారా ఇంగ్లండే లాభంపొందింది. అందువలన యీ ఒడంబడిక మనదేశంలో తీవ్ర విమర్శకు గురిఅయింది. 1936 లో భారతఅసెంబ్లీ దీనిని రద్దుచేసింది. కాని వైస్రాయి త్రోసివేయుటతో 1939 వరకు కొనసాగించ బడింది.

1939 లో దాదాపు యిటే షరతులతో మరొక ఇండో-బ్రిటిష్ వ్యాపార ఒడంబడిక చేసుకోబడింది. స్వాతంత్ర్యం సాధించేవరకు యిదే ఒడంబడిక అమలులోనున్నది.

అదేవిధంగా భారతదేశం 1934, 1937 లలో జపాన్‌తోను, 1941 లో బర్మాతోను వ్యాపార ఒడంబడికలు చేసుకున్నది.

రెండవప్రపంచ యుద్ధకాలంలో భారత వాణిజ్యవిధానం అత్యవసర యుద్ధావసర సరుకులను దృష్టిలో పెట్టుకుని సవరించబడింది. ఎగుమతి, దిగుమతులు కంట్రోలు చేయుబడ్డాయి. శత్రురాజ్యాలతో వ్యాపారం నిషేధించబడింది.

స్వాతంత్ర్యానంతరం భారతదేశం తన యెగుమతి వ్యాపారాన్ని పెంచుకునేందుకు, అననుకూల వ్యాపార శేషాన్ని తగ్గించుకునేందుకు, తనకు కావలసిన యంత్రసామగ్రిని సమకూర్చుకునేందుకు బ్రిటిష్ కామన్వెల్తులోలేని అనేక దేశాలతో పరస్పర వ్యాపార ఒడంబడికలు (*bilateral trade pacts*) చేసుకుంది. నార్వే, స్వీడన్, జపాన్, పశ్చిమజర్మనీ,

ఇటలీ, ఆస్ట్రియా, ఇండోనీషియాలతో వ్యాపార ఒప్పందాలు, నేపాల్, ఆఫ్ఘనిస్థాన్, పాకిస్థాన్, అర్జెంటీనా, ఈజిప్టు, చైనా, రష్యా, పోలెండ్, జెకోస్లొవేకియా, హంగరీ వగైరాలతో వ్యాపార ఒడంబడికలు, వస్తునూర్పిడి ఒడంబడికలు చేసుకున్నది.

ఈవిధంగా భారతదేశం అనేక దేశాలతో పరస్పర వ్యాపార ఒడంబడికలు చేసుకున్నప్పటికీ, అంతర్జాతీయ వ్యాపార సంస్థలోకూడా (*International Trade Organization*) సభ్యురాలుగా చేరింది. 50 దేశాల సభ్యత్వంతో యీ సంస్థ జెనీవాలో 1947 లో ఏర్పరచబడింది. దీనిలో సభ్యత్వంగల దేశాలన్నీ పరస్పర వ్యాపారము, వ్యాపార సుంకాలకు సంబంధించిన ఒక సాధారణ ఒడంబడికకు (*General Agreement on Tariffs & Trade*- దీనినే *G A T T* అంటారు) కట్టుబడియుండాలని నిర్ణయించబడింది. దీని ప్రకారం సభ్యత్వంగల దేశాలు పరస్పరం వ్యాపారసుంకాలను (*Tariffs*) తగ్గించుకుంటాయి. ఈ దేశాలతో భారతదేశం తన వ్యాపారంలో దాదాపు 50% వరకు సాగిస్తూంది.

పైన క్లుప్తంగా భారతప్రభుత్వం అవలంబిస్తూ వచ్చిన వాణిజ్యవిధానము వివరించబడింది. ఇదే సందర్భంలో మన యిరుగుపొరుగు దేశమైన పాకిస్థానతో మనదేశ వ్యాపార సంబంధాలనుకూడా పరిశీలించడ మవసరము.

## భారత - పాకిస్థాన్ల వ్యాపార సంబంధాలు

1947 ఆగస్టులో దేశవిభజనానంతరం భారత - పాకిస్థాన్ల మధ్య వ్యాపారసంబంధాలు యథాతథంగా ఉండాలని ఒడంబడికకు రావటం జరిగింది. 1948 మార్చిలో ఆ ఒడంబడిక అంతం గావడంతో యీ రెండు దేశాలమధ్య వ్యాపారం అనేక ఒడుదుడుకులకు లోనయింది.

1948 మే లో ఒకసంవత్సరంవరకు భారత-పాకిస్థానుల రూపాయల మారకపువిలువలు సమానంగా ఉండేటట్లు నిర్ణయించి ఆ పునాదిపైన ఒకవస్తుమార్పిడి ఒడంబడిక చేసుకోబడింది. కాని యిదేకాలంలో పరస్పరసంబంధాలు బెడిసిపోవుటవలననూ, పాకిస్థాన్ టారిఫ్ సుంకాలను హెచ్చుచేసినందుననూ అనుకున్నమేరకు వ్యాపారం జరుగలేదు.

తిరిగి 1949 జులైలో ప్రారంభమై 1950 జూన్లో అంతమయ్యేటట్లు మరొక ఒడంబడిక జరిగింది. కాని యింతలో 1949 లో భారతదేశపు రూపాయి మారకపు విలువను తగ్గించడము, పాకిస్థాన్ తగ్గించకపోవుటతో యీ ఒడంబడిక అమలు జరగనేలేదు.

1950 లో నెహ్రూ - లియాకత్ అలీ పాక్టు అనంతరం ఏప్రిల్లో వస్తుమార్పిడి ఒడంబడిక ఒకటి చేసుకోబడినా అది 1950 సెప్టెంబర్లో అంతమయింది. 1950 జూన్లో కొరియాయుద్ధం ప్రారంభంగావడంతో భారతదేశపు జనపనారవస్తువులకు డిమాండు బాగా పెరిగింది.

ధరలుకూడా హెచ్చాయి. పాకిస్థాన్ నుండి ముడి జనపనార దిగుమతిచేసుకోవలసిన అవసరం ఏర్పడింది. దానితో పాకిస్థాన్ రూపాయి విలువను యథాతథంగా అంగీకరించి ఒడంబడిక చేసుకోవలసి వచ్చింది. తదనుగుణంగా 1951 ఫిబ్రవరిలో ఒక ఒడంబడిక 1952 జూన్ వరకు చేసుకోబడింది. దీని ప్రకారం పాకిస్థాన్ భారతదేశానికి 35 లక్షల బేళ్ళ జనపనార, 4 లక్షల టన్నుల బియ్యం, 2¼ లక్షల టన్నుల గోధుమ సప్లయి చేసేందుకు, భారతదేశం 21 లక్షల టన్నుల బొగ్గు సప్లయిచేసేందుకు అంగీకరించబడింది. కొన్ని పరిమితులలో యితరసరుకులుకూడా పరస్పరం తెప్పించుకునేందుకు అంగీకరించబడింది.

1952 ఆగస్టులో స్వేచ్ఛగా పరస్పర వ్యాపారానికి మరొక ఒడంబడిక చేసుకోబడింది. అయితే పాకిస్థాన్ తన జనపనారపైన లైసెన్సు ఫీజు నెక్కువగా విధించుటవలన వ్యాపారం సాఫీగా జరుగలేదు. మరల 1953 మార్చిలో 1953 జూలైలో ప్రారంభమై మూడు సంవత్సరాలవరకు మరొక ఒడంబడిక కుదుర్చుకోబడింది. దీనిప్రకారం పాకిస్థాన్ జనపనారపై విధిస్తున్న హెచ్చు లైసెన్సు ఫీజు రద్దుచేయబడింది. తరువాత 1955 జూలై 19 న మరొక ఒడంబడిక జరిగింది. 1955 జూలైలో పాకిస్థాన్ రూపాయి మారకపువిలువకూడా భారతదేశపు రూపాయితో సమానంగా తగ్గించబడింది. అయినా భారత-పాకిస్థాన్‌లమధ్య వ్యాపారంలో పెద్ద మార్పు రాలేదు. దీనికి ప్రధానకారణం యీ రెండు దేశాలమధ్య రాజకీయసంబంధాలు బాగుండకపోవుటయే. 1953-56 సం॥ల

మధ్య యీ రెండు దేశాలమధ్య వ్యాపారం యీ దిగువ విధంగా ఉన్నది.

(కోట్ల రూపాయలలో)

| | 1953-54 | 1954-55 | 1955-56 |
|---|---|---|---|
| పాకిస్థాన్‌కు భారతదేశపు ఎగుమతులు | 8.02 | 9.65 | 8.9 |
| దిగుమతులు | 19.27 | 19.58 | 20.9 |

భారతదేశం పాకిస్థాన్‌కు ప్రధానంగా బొగ్గు, బట్టలు, సుగంధద్రవ్యాలు ఎగుమతి చేస్తూంటుంది. పాకిస్థాన్ నుండి ముడి జనపనార, కూరలు, పండ్లు, తోళ్లు, చర్మాలను దిగుమతి చేసుకుంటోంది.

పైన వివరించినదానినిబట్టి భారత–పాకిస్థానుల ఆర్థిక వ్యవస్థలు ఒకదానిపై ఒకటి ఆధారపడియున్నాయని, వీటి రెంటిమధ్య అన్యోన్యసహకార మవసర మని కన్పడుతుంది. కాని రాజకీయసంబంధాలు క్షీణించినందున రెండూ నష్టపోతున్నాయి.

## విదేశీ వ్యాపారంలో ఒడుదుడుకుల కారణాలు

ఇంతవరకు వివిధదశలలో మన విదేశీవ్యాపారసరళి, మన వాణిజ్యవిధానము ఎలాఉన్నాయో పరిశీలించాము. మన విదేశీవ్యాపారం నిలకడలేక అనేక ఒడుదుడుకులకు లోనవుతూ వచ్చిందనీ, స్వాతంత్ర్యానంతరం మన వ్యాపారంలో నిరంతరము లోటు ఉంటూనేవచ్చిందనీ, రెండవప్రణాళికాకాలంలో

యీలోటు మరింత పెరిగిందనీ, ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలన్నీ విఫలమై మన విదేశీమారకపు నిధులు తరిగిపోయి మనకు సంక్షోభానికి దారితీసిందనీ చూశాము.

మన విదేశీ వ్యాపార క్షీణతాచిహ్నాలు:— స్వాతంత్ర్యానంతరం ముఖ్యంగా 1951 నుండీ మనఎగుమతుల మొత్తంలోగాని, విలువలోగాని పెరుగుదల దాదాపు ఏమీ లేదనే చెప్పాలి. రెండవవైపున వ్యాపార లోటుమాత్రం క్రమంగా ఎక్కువౌతూనే ఉన్నదని యీ క్రింది వివరాలు రుజువుచేస్తాయి.

(కోట్ల రూపాయలలో)

| | 51-52 | 52-53 | 53-54 | 54-55 | 55-56 | మొత్తం |
|---|---|---|---|---|---|---|
| ఎగుమతులు | 730.1 | 601.9 | 539.7 | 596.6 | 642.2 | 3110.5 |
| దిగుమతులు | 962.9 | 633.0 | 591.8 | 631.6 | 747.7 | 3617.0 |
| శేషం | – 232.8 | – 31.1 | – 52.1 | – 35.0 | – 105.5 | – 506.5 |

(రిజర్వుబ్యాంకు బులెటిన్, 1956 నుండి)

పై వివరాలనుబట్టి మొదటి పంచవర్ష ప్రణాళికాకాలం మొత్తంమీద నిరంతరం లోటు ఉంటూనే ఉందనీ, ప్రణాళికాకాలంలో మొత్తంలోటు రు. 506.5 కోట్లనీ తేలుతుంది. 1956 ఏప్రిల్ నుండి 1957 సెప్టెంబరు లోపల మన వ్యాపార లోటు మరొక రు. 591 కోట్లు అయింది. 1957 అక్టోబరు నుండి 1958 మార్చి ఆఖరుకు మరొక రు. 230 కోట్లు లోటు యేర్పడింది. ఈ లోటును చెల్లించేందుకు విదేశీద్రవ్య మారక

కపు నిధులు వాడుటవలన అవి క్రమంగా తరిగిపోతున్నాయి. 1956 లో 683.46 కోట్ల రూపాయలనుండి మన విదేశీద్రవ్య మారకపు నిధులు 1958 మే నాటికి రు. 305.93 కోట్లకు తగ్గిపోయాయి. (1958 జూన్ రిజర్వుబ్యాంక్ బులెటిన్ నుండి)

ఈవిధంగా విదేశీవ్యాపారంలో నిరంతర లోటు ఏర్పడుటకు కారణ మేమిటి? ప్రభుత్వం అవలంబిస్తున్న ఎగుమతి దిగుమతుల విధానము, వాణిజ్య వ్యాపార విధానాలు, సామ్రాజ్యవాద దేశాల మార్కెట్లపైననే ప్రధానంగా ఆధారపడుట వగైరాలే ముఖ్యకారణాలు.

దిగుమతి వ్యాపారం:— 1956–57 సం॥ లో మన భారతదేశం దిగుమతిచేసుకున్న సరుకులవివరాలు యీ క్రింది విధంగా ఉన్నాయి.

(కోట్ల రూపాయలలో దిగుమతుల విలువ)

| సరుకు | 1956 | 1957 |
|---|---|---|
| లోహాలు–లోహసామగ్రి | 159.49 | 229.16 |
| యంత్రాలు (విద్యుద్యంత్రాలు గాక) | 125.64 | 171.83 |
| చమురులు | 75.81 | 107.51 |
| రవాణాబండ్లు | 68.90 | 75.81 |
| విద్యుద్యంత్రాలు–పరికరాలు | 45.13 | 61.14 |
| ఆహారధాన్యాలు, పప్పులు–పిండి పదార్థాలు | 4.39 | 55.39 |
| రసాయనికవస్తువులు, ఓషధులు, మందులు | 41.96 | 51.60 |
| ముడి ప్రత్తి | 35.90 | 48.62 |
| పండ్లు–కూరలు | 15.09 | 21.27 |

| సరుకు | 1956 | 1957 |
|---|---|---|
| కాగితం-అట్టలు-స్టేషనరీ | 16.00 | 17.00 |
| కట్లరీ, ఇనుపసామాగ్రి | 27.33 | 14.31 |
| కృత్రిమపు పట్టునూలు | 17.40 | 12.99 |
| ముడిఉన్ని | 9.94 | 12.98 |
| ముడి జనపనార | 13.92 | 7.20 |
| సుగంధద్రవ్యాలు | 8.13 | 2.93 |
| నానావిధ్యాసాధన ప్లాస్టిక్ సామగ్రి | 14 81 | 14.24 |
| ఇతరములతో కలిపి మొత్తం | 815.03 | 1025.82 |

( జూలై 1, ఫార్ ఈస్టర్న్ రివ్యూనుండి )

1. పై లిస్టులో ఆహారపదార్థాలక్రింద 1957 లో రు. 55 కోట్లు పైచిలుకు ఖర్చుఅయింది. 1951 నుండీ యిదే విధంగా ఆహార దిగుమతులక్రింద కోట్లకొలది రూపాయలు ఖర్చవుతూంది. ఈ క్రింది వివరాలు చూడండి.

( కోట్లరూపాయలలో )

| | 1951–52 | 52–53 | 53–54 | 54–55 |
|---|---|---|---|---|
| ఆహారపదార్థాల దిగుమతుల విలువ | 230.3 | 156.7 | 72.5 | 70.5 |

మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వం 241 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టినా ఆహార స్వయంసమృద్ధి సాధించలేకపోయింది. దీని ప్రధాన కారణం ప్రభుత్వం దున్నేవానికే భూమి లభించేటట్లు వ్యవసాయ సంస్కరణల నమలు జరిపి కష్టపడి పండించే రైతాంగానికి ఉత్సాహం కలిగించకపోవడమే. ఆహారోత్పత్తి పెరిగి యున్నట్లయితే మన దిగుమతులలో ఆహార పదార్థాలక్రింద వెచ్చిస్తున్న కోట్లాది రూపాయలు మిగిలియుండేవి.

2. కొన్నిదిగుమతులు అత్యవసరాలు కాకపోయినా తెప్పించుట జరుగుతోంది. ఉ॥ కట్లగీ, యినుపసామానులు వగైరాలక్రింద రు. 15 కోట్లు, కృత్రిమ పట్టుసామానులక్రింద రు. 13 కోట్లు, నూనె వ్యాపారం స్టోర్సు సామగ్రి నిమిత్తం రు. 14.24 కోట్లు ఖర్చుపెట్టబడింది. ఇవి పూర్తిగా నిలిపి వేస్తే మనకువచ్చే నష్టమేమీ లేదు.

3. మనము దిగుమతిచేసుకుంటున్న ఉక్కు, యినుము లలో చెప్పుకోదగినంతభాగం సద్వినియోగం కాకుండా ప్రయివేట్ పెట్టుబడిదారుల నిర్మాణ కార్యకలాపాలలో ఖర్చుపెట్టబడుతూందని, యంత్రాలపేరుతో దిగుమతి ఐన వాటిలో కొంతభాగం ఎయిర్ కండిషనింగ్ పరికరాలు, రెఫ్రిజిరేటర్లు వగైరా విలాసాలకోసమనీ, ఉన్నిబట్టలు, గడి యారాలు, విద్యుత్ పరికరాలు తెప్పించబడుతున్నాయనీ జాతీయ పరిశోధనాసమితి వెల్లడించింది.

ఈవిధంగా అనవసరమైన దిగుమతులకు విరివిగా లైసెన్సులు యివ్వబడుతున్నాయి. వీటిని తగ్గించివేసి, అత్యవసర మైన సరుకులనుమాత్రమే దిగుమతిచేసుకున్నట్లయితే విదేశీ వ్యాపారంలో వ్యత్యాసం చాలావరకు తగ్గియుండేది.

**ఎగుమతి వ్యాపారం:—** వెనుకబడిన వ్యవసాయిక దేశాలలో పారిశ్రామికాభివృద్ధికి యంత్రాలు, యంత్ర పరిక రాలు వగైరాలను ఎక్కువ మొత్తాలలో దిగుమతిచేసుకోవల సిన అవసరం ఉంటుంది. అందువలన దిగుమతులు పెరగడం తో పాటు మన యెగుమతుల మొత్తమూ, విలువా పెరిగిన

నాడే వ్యాపార శేషం మన కనుకూలంగా ఉండి, విదేశీమారక ద్రవ్య ఇబ్బందులు లేకుండా చేసుకోగలం. కాని మన ఎగుమతి సరుకులసంఖ్యగాని, మొత్తంగాని పెరగకపోవడం సాంప్రదాయకంగా ఉన్న పాతమార్కెట్లకే పరిమితంగావడం వలన మన ఎగుమతుల వ్యాపారం మెరుగు కాకపోగా క్షీణిస్తుంది. ఈ క్రింది వివరాలను పరిశీలించండి:—

| సరుకు | ఎగుమతుల విలువ | కోట్లరూపాయలలో |
|---|---|---|
| | 1956 | 1957 |
| తేయాకు | 143.16 | 123.40 |
| జనపనార వస్తువులు | 112.49 | 118.20 |
| బట్టలు | 57.82 | 65.19 |
| ఇనుపరాయి | 21.82 | 31.51 |
| తోళ్ళు, చర్మాలు (ఊనినవి) | 23.06 | 21.75 |
| ముడిప్రత్తి, ప్రత్తిగడ్డ | 21.51 | 18.66 |
| జీడిపప్పు | 15.27 | 14.78 |
| ముడిఉన్ని | 10.65 | 12.98 |
| పంచదార | 0.80 | 12.88 |
| పొగాకు | 15.51 | 12.83 |
| ముడియినుము | 9.19 | 11.76 |
| నూనెలు | 20.80 | 11.42 |
| పీచు వస్తువులు | 9.61 | 9.78 |
| మైకా (కాకి బంగారము) | 8.78 | 9.69 |
| సుగంధద్రవ్యాలు | 9.56 | 8.43 |
| కాఫీ | 5.84 | 7.73 |
| లక్క | 9.78 | 7.05 |
| ముడితోళ్ళు – చర్మాలు | 6.07 | 6.99 |
| పెట్రోలియం – వస్తువులు | 6.96 | 6.62 |

(ఫార్ట్‌నైట్లీ రివ్యూనుండి)

పై టేబిల్‌ను పరిశీలించినపుడు యీ దిగువవిషయాలు స్పష్టమవుతాయి.

1. మన ఎగుమతి సరుకులలో ఎట్టి మార్పూ లేదు. స్వాతంత్ర్యానికిపూర్వం ఏసరుకులైతే ఎగుమతిచేస్తున్నామో వాటినే యీనాడూ ఎగుమతి చేస్తున్నాము. నిజానికి అంతకు ముందు ముడిజనపనారను, ముడిప్రత్తిని మనదేశం పెద్దఎత్తున ఎగుమతి చేస్తూండేది. దేశవిభజనానంతరం వాటిని దిగుమతి చేసుకోవలసివస్తూంది. ఆ కొరతను పూడ్చుకునేందుకు కొత్త ఎగుమతి సరుకులను యింతవరకు తయారు చేయలేక పోను న్నాము. కావున యీ మధ్యకాలంలో మన ఎగుమతుల స్వభావం చాలావరకు మారిందనిచెప్పడం శుద్ధఅతిశయోక్తి.

2. మన ఎగుమతులలో పూర్వంలాగే కొద్ది సరుకులు మాత్రమే ప్రధానస్థాన మాక్రమిస్తున్నాయి. ఉదా॥ మన తేయాకు, ముడిప్రత్తి, నూనెలు, తోళ్లు, చర్మాలు, బట్టలు, జనపనారసరుకుల ఎగుమతులు మన మొత్తం ఎగుమతులలో 1950 లో 69% ఉంటే, 1955 లో 67%, 56 లో 66% ఉన్నాయి. అలాగే మన ఎగుమతి వ్యాపారంలో మొదటి ప్రణాళికాకాలంలో మన పారిశ్రామికవస్తువులభాగం 1950లో 55% ఉంటే, 1955 లో 43% కు తగ్గాయికాని పెరగలేదు.

3. అదేవిధంగా మనం ఎగుమతిచేస్తున్న వస్తువుల మొత్తమూ, ఎగుమతి విలువాకూడా తగ్గిపోతున్నాయి. ఉదా॥ 1956 లోకన్న 1957 లో తేయాకు ఎగుమతుల విలువ 20 కోట్ల రూపాయలు తగ్గిపోయింది. 1958 లో మొదటి

5 నెలలలోను మన ఎగుమతుల మొత్తం గత సంవత్సరం యిదే కాలంతో పోల్చినప్పుడు 13% తగ్గిపోయిందని యు. కె. బోర్డు ఆఫ్ ట్రేడ్ జర్నల్ వ్రాసింది.

## పాతమార్కెట్లకే అంటిపెట్టుకొనియుండుట

మన ఎగుమతులు చాలవరకు సాంప్రదాయికంగా వస్తున్న పాతదారుల వెంటనే నడుస్తున్నాయి. రెండవ ప్రపంచయుద్ధానికి పూర్వంకన్న దరిమిలా ఇంగ్లండుతో మన వ్యాపారం తగ్గినా యీనాటికీ ఇంగ్లండుతోనే ఎక్కువవంతు వ్యాపారం జరుగుతూంది. అమెరికాతో మన వ్యాపారం క్రమంగా పెరుగుతూంది. అదేవిధంగా కెనడా, ఆస్ట్రేలియా, పశ్చిమ యూరపియన్ రాజ్యాలతోకూడా పెరుగుతూంది.

మన ఎగుమతి-దిగుమతి వ్యాపారంలో ఇంగ్లండు, అమెరికాలవంతు :—

| | ఇంగ్లండు | | అమెరికా | |
|---|---|---|---|---|
| సంవత్సరం | దిగుమతులు | ఎగుమతులు | దిగుమతులు | ఎగుమతులు |
| 1948 | 27·5% | 22·5% | 20·0% | 16·7% |
| 1950 | 23·5% | 23·0% | 16·0% | 17·0% |
| 1951 | 19·0% | 26·0% | 20·5% | 17·0% |
| 1952 | 20·0% | 21·4% | 33·0% | 18·5% |
| 1953 | 25·7% | 28·0% | 28·5% | 20·0% |
| 1955 | 27·5% | 27·5% | — | — |

మన మొత్తం ఎగుమతి – దిగుమతి వ్యాపారంలో ఇంగ్లండు, అమెరికా, పశ్చిమ యూరపియన్ రాజ్యాలదే

ప్రథానస్థానం. 1948 లో మన దిగుమతులలో వీటివంతు 70·4%, ఎగుమతులలో 68·6% ఉన్నది. 1955 లో కూడా క్రమంగా 84%, 82% కు పెరిగింది. ఈవిధంగా సామ్రాజ్య వాద దేశాలతో మన వ్యాపారం పెరుగుతూందేతప్ప తర గడంలేదు.

రెండోవైపున సోషలిస్టు మార్కెట్‌తో మన వ్యాపారం యీ మధ్యకాలంలో కొద్దిగా పెరిగినా సాంప్ర దాయిక మార్గాలనుండి మళ్ళించగలిగిన మేరకు జరుగుటలేదు. ఉ॥ 1948 లో మన ఎగుమతులలో 1·3%, దిగుమతులలో 1% మాత్రమే తూర్పు యూరప్ రాజ్యాలతో చేయబడ్డాయి. 1955 లో అవి క్రమంగా 0·7%, 1·4% గాను, 1956 లో 1·5%, 3·2% గానూ ఉన్నాయి.

పైన వివరించినట్లు మన ఎగుమతి–దిగుమతి వ్యాపారం పాతమార్గాలలోనే, పాతమార్కెట్లలోనే జరుగుతూండుట వలన మనం అనేక ఒడుదుడుకులను ఎదుర్కొ—వలసి వస్తూంది.

1. పారిశ్రామికంగా బాగా అభివృద్ధియైన దేశాలతో స్వేచ్ఛావ్యాపార సూత్రాలకు కట్టుబడి వ్యాపారం సాగించుట మంటే మనదేశంలాంటి వెనుకబడిన దేశాలకు నష్టమేగాని లాభ ముండదు. ఆ దేశాలు మనకు ఎగుమతిచేసే సరుకులు ఎక్కు—వగాను, మననుండి దిగుమతిచేసుకునే సరుకులు తక్కు— వగాను ఉంటాయి. అందులోనూ యీమధ్య కొన్ని ప్రాథమిక సరుకులు, జనపనార, రబ్బరు వగైరాలను కృత్రి మంగా తయారుచేస్తున్నందువలన వెనుకబడినదేశాల ప్రాథ మిక సరుకుల ఎగుమతులు తగ్గిపోతున్నాయి.

2. పారిశ్రామికంగా అభివృద్ధియైన పెట్టుబడిదారీ దేశాల ఆర్థికవ్యవస్థలు మాటిమాటికీ మాంద్యాలకు, సంక్షోభాలకు గురి అవుతూండడంవలన, అవి తమ దిగుమతులలో కోతపెట్టి ఎగుమతులను ప్రోత్సహిస్తూండడంవలన వాటితో మన వ్యాపారం ఒడిదుడుకులకు గురౌతూన్నది.

3. పెట్టుబడిదారీ వ్యవస్థలో సహజంగా ఉండే ధరల ఒడిదుడుకుల సుడిగుండంలో మన ఎగుమతి-దిగుమతి సరుకుల ధరలుకూడ స్థిరత్వాన్ని కోల్పోయి మనకు చాలా నష్టాన్ని కల్గిస్తున్నాయి. 1901-51 మధ్య 50 సం॥ల కాలంలో ప్రాథమిక సరుకులైన జనపనార, ముడిప్రత్తి, పొగాకు, తేయాకు వగైరా ధరల సూచి 100-74 మధ్య ఊగిసలాడుతూన్నదని మిత్రరాజ్యసమితి అంచనా. కొన్ని సరుకుల ధరలు ఒక్కొక్క-ప్పుడు విపరీతంగా పడిపోవడంకూడా జరుగుతున్నది. ఉ॥ 1954 లో ఇనుపరాయి ఎగుమతి వ్యాపారం తీవ్రంగా దెబ్బ తిన్నది. ఇందులో అత్యుత్తమతరగతికి చెందిన సరుకు ధర రు 150 నుంచి రు 70 లకు పడిపోయింది. వందలకొలది గనులు మూతపడి దాదాపు 50,000 మందివరకు నిరుద్యోగులయ్యారు. 1951 నుండి మైకా (కాకిబంగారం) ధరలు పడిపోతూవస్తున్నాయి. 1953 జూన్‌నాటికి దీని ధర 60% వరకు పడిపోయింది. అదేవిధంగా జనపనార, జనపనార వస్తువులు పొగాకు వగైరాల ధరలు మాటిమాటికి మారుతూండడం, తత్ఫలితంగా మనపరిశ్రమాంగం దెబ్బతినడం చూస్తూనేఉన్నాం. ఈ సరుకులలో విదేశీవ్యాపారాన్ని కొనసాగించే గుత్తసంస్థలు విదేశస్థులవి కావడంవలన సీజన్‌లో ధరలు తగ్గించడం,

తరువాత యెక్కువ ధరల కమ్ముకోని విపరీతలాభాలు సంపాదించడంకూడా జరుగుతూఉంది.

4. ఈ మధ్యకాలంలో పారిశ్రామికంగా అభివృద్ధియైన దేశాలు తమలో తాము వ్యాపారాన్ని పెంపొందించుకునే ధోరణి ద్యోతకమౌతూంది. ఫలితంగా మన దేశం లాంటి వెనుకబడిన దేశాలలో ఆ దేశాలవ్యాపారం క్రమంగా తగ్గిపోతూవుంది.

5. రెండవవైపున ప్రపంచంలో యెట్టి సంక్షోభాలకు గురికాని విస్తృతమైన సోషలిస్టుమార్కెట్టు మన దేశంనుండి న్యాయమైన, పరస్పరం అనుకూలమైన, లాభదాయకమైన పద్ధతులలో వ్యాపారం సాగించుటకు సిద్ధంగానున్నప్పటికీ మన ప్రభుత్వమూ, మన వ్యాపారస్తులు ఆ మార్కెట్టువ్యాపారం చేయుటకు ముందుకు రావడంలేదు. చాలా కొద్దిగామాత్రమే సోషలిస్టుదేశాలతో వ్యాపారం సాగించబడుతూంది.

6. మన ఎగుమతి-దిగుమతి వ్యాపారం పూర్తిగా దేశీయ విదేశీ ప్రైవేటువ్యాపారస్తుల దయాదాక్షిణ్యాలకు వదలి వేయుట ఫలితంగా పై దుష్ఫలితాలకు గురికావడమే కాక సంవత్సరానికి కొన్ని కోట్లరూపాయలమేరకు మన దేశం నష్టపోతూంది.

అందువలన మన ఎగుమతి-దిగుమతి వ్యాపారం అభివృద్ధి కావాలంటేనూ ఒడిదుడుకులకు గురికాకుండా ఉండాలంటేనూ, వ్యాపారశేషం మన కనుకూలంగా పరిణమించి విదేశీద్రవ్య మారకపు యిబ్బందుల నధిగమించాలంటేనూ యీ క్రిందిచర్యలు తీసుకోవలసి యుంటుంది.

1. విదేశీవ్యాపారాన్ని, కనీసం ముఖ్యమైన యెగుమతి-దిగుమతి సరుకుల వ్యాపారాన్నైనా జాతీయం చేయవలసి యుంటుంది. ప్రభుత్వం యీ విషయంలో పూర్తిగా అలక్ష్యవైఖరి నవలంబిస్తోంది. 1956 మే లో ప్రభుత్వట్రేడింగ్ కార్పొరేషనును యేర్పాటుచేసింది. దాని తరఫున 1956-57 సం॥ లో రు. 11.65 కోట్ల విలువగల యెగుమతులు, రు. 24.47 కోట్ల విలువగల దిగుమతులు చేయబడ్డాయి. ఇది ఎగుమతి-దిగుమతి వ్యాపారంలో ఎంత తక్కువో వేరే చెప్ప నక్కరలేదు.

2. మన దిగుమతులపైన ప్రభుత్వం ఖచ్చితమైన ఖాయిదా ఉంచుకోవాలి. ప్రైవేటు వ్యాపారస్తులు, పెట్టుబడిదారులు దిగుమతి చేసుకునే సరుకులను అత్యవసరాలైతే తప్ప అంగీకరించ కూడదు. విలాసవస్తువుల దిగుమతిని, మనదేశంలో లభ్యమయ్యే సరుకుల దిగుమతిని పూర్తిగా తగ్గించివేయాలి.

3. మన యెగుమతులను పెంచుటకు తీవ్రంగా కృషి చేయాలి.

4. పాతమార్కెట్ కే కట్టుబడియుండక న్యాయసమ్మతంగాను, స్వప్రయోజనాలకు నష్టంకానివిధంగాను, వ్యాపారం సాగించుటకు క్రొత్తమార్కెట్లను వెదకాలి. ముఖ్యంగా సంక్షోభరహితమైన సోషలిస్టుమార్కెట్ తో మన వ్యాపారాన్ని పెంపొందించుకోవలసియుంటుంది.

---